# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. N..

స్థాపితం: 1930

సంపుటి: 57 సంచిక: 3

17-1-1986

శుక్రవారం

12 పేజీలు: రూపాయి


# అసంతృప్తులకు ఆశ్రయం దొరికింది!

చిన్నల్లుడు శ్రీ చంద్రబాబునాయుడుకు పార్టీ ప్రధానకార్యదర్శిపదవి అప్పగించినందువల్ల పెద్దల్లుడు డాక్టర్ వెంకటేశ్వరరావుకు మంత్రిపదవి ఇవ్వాలని ముఖ్యమంత్రి శ్రీ రామారావుపై ఒత్తిడి పెరుగుతున్నది. డాక్టర్ వెంకటేశ్వరరావు శ్రీ చంద్రబాబునాయుడుల మధ్య సాగుతున్న ప్రచ్ఛన్నవైరం మహానాడులో రచ్చకెక్కడంతో తెలుగుదేశంపార్టీరాజకీయాలు రసకందాయంలో పడ్డాయి. తెలుగుయువతను రెచ్చగొట్టి మహానాడును అల్లకల్లోలం చేసిన శ్రీ వెంకటేశ్వరరావు శ్రీ చంద్రబాబునాయుడు వ్యూహానికి చిత్తయి ఆయనను పదవిలోకి రానీయకుండా చేయడంలో విఫలమయ్యారు. అసలు మామపై పట్టులేకనే ఆయన ఆపనిచేశాడని లోపలే గుట్టుగా పోరాడి సాధించుకోకుండా వీధినపడి తానేగాక పార్టీనికూడ అల్లరిపెట్టినందువల్ల బెడిసికొట్టిందని శ్రీ వెంకటేశ్వరరావువర్గంవారు స్వయంగా వ్యాఖ్యానిస్తున్నారు. అయితే డాక్టర్ వెంకటేశ్వరరావు వర్గం వారు సృష్టించిన గందరగోళం పార్టీలోని అసమ్మతివాదులను ఎంతగా సంతోషపెట్టిందో అంతేస్థాయిలో శ్రీ ఎన్. టి. ఆర్. ను చంద్రబాబునాయుడును కలవరపరచింది. ఏడాదిపాటు గండిపేటలో నిర్వహించిన శిక్షణాతరగతులకు ఇది తీరనిమచ్చ అని వారు భావిస్తున్నారు. ఈ వ్యవహారంలో డాక్టర్ వెంకటేశ్వరరావుకుగాక మరొకరెవరికైనా పాత్ర వుందా అనేవిషయంపై వారు ఆరాలు తీస్తున్నట్లు తెలుస్తున్నది.

ఒకవంక తెలుగుయువతవారు వీధినపడి కేకలువేస్తుంటే డాక్టర్ వెంకటేశ్వరరావు ముఖంలో సంతృప్తి వెల్లివిరిసినప్పటికీ దానిని ఎంతోసేపు నిలువనీయకుండా చంద్రబాబునాయుడిని పార్టీ ప్రధానకార్యదర్శిని చేస్తున్నట్లు పార్టీ అధ్యక్షుడు ప్రకటించాడు. దీనితో శ్రీ వెంకటేశ్వరరావు వర్గం కథ మళ్ళి మొదటికొచ్చినట్లయింది. చంద్రబాబునాయుడు ప్రధాన కార్యదర్శిగా వుండగా అనుబంధసంస్థ అయిన తెలుగుయువత అధ్యక్షుడిగా ఆయన కొనసాగే ప్రసక్తి ఏంతమాత్రం వుండదు. అందువల్ల

**మా హైదరాబాదు విలేఖరి**

చంద్రబాబునాయుడు పని పట్టడానికి ఇప్పుడు ఏకంగా మంత్రివర్గంలోనే సీటు సంపాదించాలని శ్రీ వెంకటేశ్వరరావు వర్గం ప్రయత్నిస్తుండగా దీనికి కూడా గండికొట్టడానికి శ్రీ చంద్రబాబునాయుడు ఆయన వర్గం ప్రయత్నాలు ప్రారంభించినట్లు తెలిసింది. అయితే శ్రీ రామారావు మాత్రం మంత్రిపదవి ఇచ్చేవిషయంలో సుముఖంగానే వుండవచ్చునని అనుకుంటున్నారు. ఎందుకంటే విమర్శలు వస్తాయని భయపడకుండా చిన్నల్లుడికి పార్టీ పదవి ఇచ్చినంత సులభంగా పెద్దల్లుడికి మంత్రిపదవికూడా ఇవ్వవచ్చునని భావిస్తున్నారు. డాక్టర్ వెంకటేశ్వరరావు మహానాడు ఉదంతం తర్వాత ఇంతవరకు మామను కలుసుకోవడంగాని ఆయన ఇంటికి వెళ్లడంగాని చేయడంలేదు. తెగేదాక లాగి స్వతహాగా నెమ్మదస్తుడైన డాక్టర్ వెంకటేశ్వరరావును దూరం చేసుకోవడం ముఖ్యమంత్రి మనస్తత్వానికి విరుద్ధమని తె. దే. వర్గాలవారు అంటున్నారు. ఒకవేళ ఆయన ఏమాత్రం వెనక్కు తగ్గినా పార్టీలో తంటా తప్పదని చెబుతున్నారు. డాక్టర్ వెంకటేశ్వరరావుకు మంత్రిపదవి ఇస్తే అల్లుళ్ళ రాజ్యం అన్నపేరు సార్థకమై ప్రజల్లో భ్రష్టుపట్టి పోతామేమో అని ఆయన శంకిస్తున్నట్లు తెలిసింది. వెంకటేశ్వరరావుకు మంత్రిపదవి ఇస్తే ఆయన బలపడి తన ప్రాబల్యానికి గండికొడతారేమోనని చంద్రబాబునాయుడు భయపడుతుండగా ఇవ్వకపోతే అసమ్మతివాదులందరికి కేంద్రబిందువై పార్టీలో ఉద్యమాన్ని పెంచేందుకు ప్రయత్నాలు సాగించవచ్చునని పార్టీ వర్గాలవారు ఆందోళన పడుతున్నారు. ఇకపోతే అల్లుళ్ళమధ్య ఇప్పుడు సాగుతున్న పోరాటం పార్టీలోని వారినేకాక ఇతర పార్టీల ప్రముఖులనూ ఆకర్షిస్తున్నది. చంద్రబాబునాయుడు కొందరు ప్రముఖ వ్యక్తుల మద్దతును బాహాటంగానే పొందుతుండగా డాక్టర్ వెంకటేశ్వరరావును ఈనాడు పత్రికాధిపతి రామోజీరావు లోలోపల బలపరుస్తున్నట్లు వినికిడి. ముందుముందు రామోజీరావు మద్దతు తమకు పూర్తిగా ఉండగలదని వెంకటేశ్వరరావు వర్గం వారు ఆశిస్తున్నారు. మార్చిలో జరిగే రాజ్యసభ ఎన్నికల్లో ఓటింగ్ సవ్యంగా జరిగేట్లు చూసిన అనంతరమే మంత్రివర్గ విస్తరణ చేయాలని ముఖ్యమంత్రి అనుకున్నట్లు తెలిసింది. ★

ఫోన్ : 5473



# రత్నం రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి

14/46ఎ, హరనాథపురం, నెల్లూరు-524 003

## పదవ తరగతి విద్యార్థినీ విద్యార్థులకు శుభవార్త

ఎం.బి.బి.ఎస్. ప్రవేశ పరీక్షకు కోచింగ్ యిస్తూ అత్యధిక శాతం ఫలితాలు సాధించి
రాష్ట్రంలో ఉత్తమ శిక్షణ సంస్థగా పేరుపొందిన

రత్నం కోచింగ్ సెంటర్ ఆధ్వర్యంలో 1986 జులై 20వ తేదీ నుండి

## రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి

ప్రారంభించుచున్నామని తెలుపుటకు సంతోషిస్తున్నాము.

ప్రస్తుతం 10వ తరగతి చదువుతున్నవారు ఇంగ్లీష్ మీడియం **Bi.P** మరియు **M.P** గ్రూపులలో చేరుటకు 31, మార్చి 86 లోగా రూ. 1000/-లు కట్టి సీటు రిజర్వు చేసుకొనగోరుచున్నాము.

గమనిక : * (10వ తరగతిలో 400 మార్కులకంటే ఎక్కువ పొందినవారే అడ్మిషన్లకు అర్హులు)
సీట్లు | BiP 25 / MP 25

---

## R రత్నం కోచింగ్ సెంటర్ (రెసిడెన్షియల్)

(రిజిష్టర్ నెం. 5818) ఫోన్ : 5473
14/46-ఎ. హరనాథపురం, నెల్లూరు-524 003.

### 1985 జూన్ నెల ఎం.బి.బి.ఎస్. ప్రవేశ పరీక్షలో విజయం సాధించిన మా విద్యార్థులు :

| పేరు | రిజిష్టరు నెం. | పేరు | రిజిష్టరు నెం. | పేరు | రిజిష్టరు నెం. | పేరు | రిజిష్టరు నెం. |
|---|---|---|---|---|---|---|---|
| బి. అరవింద్ | 90790 | టి. దుర్గ | 73476 | కె. శ్రీవాణి | 73503 | ఏలిస్. జమీమా | 90763 |
| ఆర్. మమత | 90683 | పి. ఝాన్సీ | 63614 | విజయలక్ష్మి | 90968 | ఒ. రవీంద్రబాబు | 71401 |
| ఐ. జి. ధనలక్ష్మి | 70867 | సి. అపర్ణ | 69857 | బి. వి. అమృతవల్లి | 90951 | వి. సురేఖ | 71360 |
| ఐ. ఇందిర | 90723 | ఎ. పద్మజ | 90937 | జి. సుధారాణి | 90855 | మాధవి | .... |
| బి. రవిచంద్రారెడ్డి | 91176 | రాధ | 69975 | వి. రాధికారెడ్డి | 90990 | ఎస్.కె. మైమూన్ | 91113 |
| కె. గోపాల్ | 70643 | సి. వి. శారద | 70897 | జి. వి. మహేష్ | 91022 | ఉమామహేశ్వరి | 91236 |
| భవాని | 63288 | లాలస | 91180 | జి. లలితకుమారి | 70853 | ఎస్. కె. అనసూయ | 72386 |
| కె. వి. రమణమ్మ | 73232 | ఎం.ఎస్. శైలజారెడ్డి | 96041 | బి. ప్రమీలారాణి | 90671 | కె. మమత | 90971 |
| డి.ఎం.ఎస్. రాజు | 71030 | కె. అంజనీకుమార్ | 91177 | ముంతాజ్ బేగం | 91112 | కె.ఎస్. మృణాళిని | 71672 |
| డి. శైలజ | 73388 | జి. విశాల | | డి. శ్రీహరిరావు | 70873 | బి. అరుణ | 69260 |
| కె. మల్లికార్జున | 73008 | సిహెచ్. జయంతి | 90339 | జి. మాధవీలత | 90871 | కిశోర్‌కుమార్ | 73385 |
| వాసంతి దేశాయ్ | 63433 | అనితా వి. పాయ్ | 73453 | ఎం. సౌజన్య | 90812 | జి. సుజాత | 70008 |
| ఎం. మాధవీలత | 90614 | మురళీ శంకరరెడ్డి | 71467 | ఎం. విద్యాసాగర్ | 74473 | జి.వి.జి. మహేష్ | 73048 |
| అనూజ | .... | జి. శ్రీధర్ | 69559 | వి. శేఖర్ | 69135 | ఎం. రామారావు | 73843 |
| ఆర్. రాధిక | 70256 | డేవిడ్ విజయకుమార్ | 74463 | సుదర్శన్ | 71319 | వినోద్‌కుమార్ | 72231 |
| హెచ్. దత్తాత్రేయులు | 74148 | వి. శ్రీధర్‌రెడ్డి | 70988 | సి. హరిహరప్రసాద్ | 74646 | ఎ. రేణుక | 73519 |
| కె. శ్రీకాంత్ | .... | ఎం సెల్వాంబ | 72557 | ఆనంద సుధాకర్ | 71308 | బి. సురేష్‌బాబు | 71463 |

తిరుపతి కర్నూలు జోన్‌లో సగానికి పైగా మా విద్యార్థులే ఓపెన్ కాంపిటీషన్‌లో విజయం సాధించారు. ఇంతవరకు మా సేవలు రాయలసీమవరకే పరిమితమైనవి. రాష్ట్రవ్యాప్తంగా మా సేవలు అందించాలనే ఆకాంక్షతో యీ వివరాలు మీకందజేస్తున్నాము.

1986 ఏప్రెల్! మే బ్యాచ్‌లో ఎం.బి.బి.ఎస్. మరియు బి.ఇ., బి.టెక్. ప్రవేశపరీక్షకు కోచింగ్ తీసుకోదలచినవారు జనవరి 31 లోగా రూ. 600/-లు మనియార్డరు పంపి మీడియం తెలిపి ముందుగా మా రెసిడెన్షియల్ పొంది సీటు రిజర్వు చేసుకొనవలెను. పోస్టల్ కోచింగ్ కావలసినవారు రూ. 600/- M.O. ద్వారా పంపి పొందవచ్చును.

గమనిక : విద్యార్థినులకు ప్రత్యేక హాస్టలు వసతి కలదు.

ప్రస్తుతం జూనియర్ ఇంటర్ చదువు విద్యార్థినీ విద్యార్థులకు మే 20 నుండి జూలై 10 '86 వరకు జూనియర్ సిలబస్‌లోమాత్రం B.E. మరియు M.B.B.S. ప్రవేశ పరీక్షకు శిక్షణ ఇవ్వబడును. సీటు కావలసినవారు మార్చి 31 లోగా రూ. 300/- M.O. పంపి రిజర్వు చేసుకొనవలసినది.

గమనిక : విద్యార్థినీ విద్యార్థులకు వేరుగా హాస్టలు వసతి కలదు.

కె. పద్మావతీరత్నం, కరెస్పాండెంటు.

# జమీన్‌రైతు

## చిత్రోత్సవం

నిర్మాణకేంద్రంగా హైదరాబాదు స్థానం ఏదైనా, చిత్ర రంగంలో సంఖ్యాత్మకంగా తెలుగుచిత్రాలకు సమున్నతస్థానమున్నది కాబట్టీ, ఈసారి అంతర్జాతీయ చిత్రోత్సవం ఆంధ్ర రాజధానిలో జరగడం సముచితంగా వుంది. అంతేకాదు, తన జీవితాన్నంతా నటనకు అంకితంచేసిన ఒకవ్యక్తి ముఖ్యమంత్రిగావున్న రాష్ట్రంలో జరగడంకూడా విశేషమే. రామారావుగారు చిత్రపరిశ్రమలో తెలుగుకున్న స్థానానికి, అగ్రనటుడైన తన ప్రభుత్వాధిపత్యానికి తగినట్లుగా ఈ వుత్సవాలను నేతృత్వంగా నిర్వహిస్తున్నారనే చెప్పవచ్చు.

ఎన్నోభాషాచిత్రాలు, వైవిధ్యంగల ఇతివృత్తంగలిగిన అనేక చిత్రాలు ఈ వుత్సవాలలో ప్రదర్శింపబడుతున్నాయి. పొడవు పొట్టి చిత్రాలు, పౌరాణిక జానపద సాంఘిక చిత్రాలు, డాక్యుమెంటరీలు, మహిళలు నిర్మించినవి, రెండవ ప్రపంచయుద్ధపు సమస్యలకు సంబంధించినవి.... ఈ విధంగా కథలో కథనంలో నటనలో నిర్మాణంలో, సాంకేతిక నైపుణ్యంలో ఏవి వుత్తమంగావున్నాయో, ఎవరు ఎవరిని చూచి దేనినిగూర్చి ఎంతవరకు నేర్చుకోవాలో అభివృద్ధిపరచుకోవాలో ముందడుగువేయాలో పరస్పరం అధ్యయనం గావించడానికి, అవగాహన చేసుకోడానికి ఈ ప్రదర్శనం మంచి అవకాశం కల్పిస్తుంది. విదేశీచిత్రాల విషయం ఎట్లున్నా, మనదేశంలో ముఖ్యంగా దక్షిణ రాష్ట్రాలలోని వివిధభాషాచిత్రాల స్థాయికి ఈ వుత్సవం అద్దంలా వుపయోగపడుతుంది. ముఖ్యంగా తెలుగు ప్రేక్షకులు ఇతర చిత్రాలతో పోల్చినపుడు తమ చిత్రాలస్థాయి ఏవిధంగావుందేది అర్థం చేసుకోవడానికి హైదరాబాదు చిత్రోత్సవం మహదవకాశం కల్గిస్తుంది.

రాశిలో ఎట్లున్నా, వాసిలో మాత్రం తెలుగుచిత్రాలు కొన్ని దక్షిణ భాషాచిత్రాలలోనే దిగదిడుపుగా వుంటాయేమో ననిపిస్తుంది. చిందులు, గంతులు, శృంగారాలతో అసహజంగా, అసభ్యంగా, అతి చౌకబారుగా తయారవుతున్నాయి తెలుగుచిత్రాలు. సమస్యలేదు., సహజత్వంలేదు, ప్రజాహృదయాలను స్పందించడంలేదు; కేవలం వేలం వెర్రిని సృష్టించి పైసలుచేసుకునే ధ్యేయంతోమాత్రం తెలుగుచిత్రాలు తయారవుతున్నాయా అనిపిస్తుంది. ప్రచారార్భాటంతప్ప, మరెందులోనూ పసవుండడంలేదు, కొత్తదనం కనిపించడంలేదు. ఈలలు, ఎగుర్ల ప్రేక్షకులుతప్ప, సాంప్రదాయకులు చూడడానికి వీలులేనంత నీచాభిరుచులకు నెలవవుతున్నాయి తెలుగుచిత్రాలు. సాంకేతికంగా తప్ప, అభ్యుదయ కోణంనుంచిచూస్తే, నేటికంటే ముప్ఫయ్ నలభై ఏళ్లక్రితం వచ్చిన చిత్రాలు వుత్తమోత్తమాలని చెప్పక తప్పడంలేదు. ఈ పరిస్థితి మారాలి: తెలుగు చిత్రపరిశ్రమ సంఖ్యాత్మకంగానేకాదు. గుణాత్మకంగాకూడా అభివృద్ధిచెందాలి.

# తడిసిన వడ్లయినా కొనండి!

సముద్రంలోపుట్టి ప్రతి వాయుగుండం రైతులపాలిట యమగండంగా పరిణమిస్తున్నది. దెబ్బమీద దెబ్బగా పడుతున్న ఈ ప్రకృతి ప్రళయాలకు రైతు నడుము విరిగిపోయింది. రైతుచేసుకున్న పాపం కాకుంటే, ఇప్పుడు వర్షాలేమిటి. గండాలు గడిచి, రేపోమాపో కోతకురానున్న మొలగొలుకుపంట పచ్చగా వుందని రైతులందరూ సంతోషించే సమయంలో వాన మహామ్మారిలాగావచ్చి విరుచుకపడింది. ఈపాటికే కోతలుజరిగిన పొలాల్లో ఒదెలు తెప్పల్లాగా తేలుతున్నాయి. పొలాల్లో నీళ్లకంటే, రైతు కన్నీళ్ళు వరదలయ్యే పరిస్థితి ఏర్పడింది.

ఈ కష్టకాలంలో రైతును ఆదుకోవలసిన బాధ్యత ప్రభుత్వంపై లేదా? వాన వల్ల చేలారి పుట్లవడ్లు తడిసి నల్లవారుతాయి. వెల్లువకు కొట్టుకుపోగా మిగిలిన ఈ ధాన్యాన్ని ప్రైవేటు మిల్లర్లు కొనరు. కనీసం ప్రభుత్వమైనా ముందుకొచ్చి తడిసిన ధాన్యంకొంటే, రైతుకు ఆవగింజంత మేలైనా జరుగుతుంది. దుందుడుకు విధానాలతో వందల కోట్లు తగలేసే ప్రభుత్వానికి ఇది పెద్దమొత్తం కాదు. మనసుపెట్టడమే ముఖ్యం. ఈ మాత్రం సాయం చేయడం ప్రభుత్వ కనీస బాధ్యత.

ఇస్కపాలెం -దేవళ్ళ రాధాకృష్ణారెడ్డి

## కోర్టు తోటపల్లి గూడూరులోనే పెట్టాలి!

కొత్తగా మనజిల్లాలోని 7 తాలూకా కేంద్రాలలో మునిసిఫ్ మేజిస్ట్రేట్ కోర్టులు స్థాపిస్తున్నట్లు ప్రకటించారు. వీటిలో ఇందుకూరుపేటకూడా ఒకటి. ఇందుకూరుపేట అంటే, ముత్తుకూరు తోటపల్లి గూడూరు మండల గ్రామాలనుకూడా దానిపరిధిలో చేరుస్తారు.

ఇది మాకెంతో అసౌకర్యం. ఇందుకూరుపేట రాజకీయ పలుకుబడివల్లనే తాలూకా కేంద్రం కాగలిగిందితప్ప, భౌగోళిక, రవాణా పరిస్థితులదృష్ట్యా అది కేంద్రంకాదు. అక్కడ మునిసిఫ్‌కోర్టు పెడితే, తక్కిన రెండుమండల గ్రామాల ప్రజలకు చాలా ఇబ్బంది. వారు ఇందుకూరుపేటకు పోవాలంటే, నెల్లూరుకు వచ్చిపోవాలి. అంటే రెండుబస్సులు మారవలసివస్తుంది.



అందువల్ల ఈ కోర్టును తోటపల్లి గూడూరులో పెడితే, అందరికీ అనుకూలం. పైగా, ఈ గ్రామంలో కోర్టుకు, మేజిస్ట్రేట్ ఇంటికి సరిపడా భవనాలు కూడా ఖాళీగా వున్నాయి: అధికారులు ఈ సూచనను పరిగణించాలి.

-జి. ఎస్. రాజశేఖరం

తోటపల్లి గూడూరు

## యూత్‌కాంగ్రెస్ అధ్యక్షత- కొన్ని సూచనలు

జిల్లా యూత్‌కాంగ్రెస్ అధ్యక్ష పదవికి అభ్యర్థిని అన్వేషిస్తున్నట్లు తెలుస్తున్నది. రాష్ట్రంలో కాంగ్రెసుపార్టీ వున్న ప్రస్తుత పరిస్థితులలో, ఈ పదవికి పర్గాటితంగా, కష్టించిపనిచేయగల్గిన అభ్యర్థిని ఎంపిక చేయవలసిన అవసరంవుంది. అందుకు శ్రీ మెట్టా చంద్రశేఖరరెడ్డి తగినవాడని నా అభిప్రాయం.

నెల్లూరు -ఎల్. సురేష్

జిల్లా యూత్‌కాంగ్రెస్ కార్యదర్శి

* * *

ఈమధ్యకాలంలో కాంగ్రెసు యువకార్యకర్తలు నిస్తేజమై, నిర్వీర్యమైపోయివుంది. అసంఖ్యాకంగావున్న యువకాంగ్రెస్‌వాదులను చైతన్యవంతం చేయగల్గిన నాయకత్వంకావాలి. మెట్టా చంద్రశేఖరరెడ్డిని యూత్‌కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఎంపిక చేయదలచడం ముదావహం. ఆయనందుకు తగినవాడు.

కావలి -షేక్ ఖలీల్ అహమ్మద్



## జమీన్‌రైతు

### 17-1-1936

**శారద**

నెల్లూరునుండి శ్రీమతి పాటూరు బాలసరస్వతమ్మగారి సంపాదకత్వమున "శారద" యను మాసపత్రిక రానుందు పున్నమనాడు వెలువడగలదని తెలియుచున్నది. ఇది సారస్వత ఆర్థిక సాంఘిక విషయములను చర్చించగలదు. సం॥ చందా 3-00 రూ॥లు మాత్రమే.

**పోలీసు సబ్ ఇన్స్‌పెక్టర్‌పై క్రిమినలు కేసు**

సూళ్లూరుపేట సబ్ ఇన్స్‌పెక్టరు హెచ్. రాఘవరావునాయుడుగారు మార్వాడి గుమాస్తాయగు కాలప్పను గురించి తప్పు నాతని గూడూరు జాయింటు మేజిస్ట్రేటు కోర్టులో కాలప్ప తరపున శ్రీయుత వెన్నెలకంటి రాఘవయ్య బి. ఎ. బి. ఎల్. గారు కంప్లయింటు దాఖలుచేసిరి.

**నెల్లూరు ముచ్చట్లు**

ఫ్రెండ్స్ యూనియన్‌వారి ఖిల్జీ: మన యూనియన్‌వారు మద్రాసున జరిగిన నాట్యకళా పరిషత్తుతో సహాయమానులై "ఖిల్జీ"ని ప్రదర్శించి పేరుప్రఖ్యాతులుగొన్నందుకు వందనీయులు. చూపోపలేనివారి వాగుడులు ఉదాసీనార్థములు కాదంటారా?

శాస్త్రిగారి షష్ఠ్యబ్ది: కళాప్రపూర్ణుని (వేదం వెంకటరాయశాస్త్రి) షష్ఠ్యబ్ది వివాదంతంగా పరిణమించడం సింహపురికి తీరని కళంకం. కలలోని ద్రాతకు ధరణికోటవారి గర్వమెంత అప్రస్తుతమో, కళాభిప్రాయాన్ని సమర్థించుటకాయన అభినవ తిక్కన అమాత్యులవారి అసభ్య ప్రవర్తన గూడ అంతకు రెండింతలు అప్రస్తుతంగానే వుండింది. సమకాలంలో మెచ్చకపోయినా చచ్చినతర్వాతైనా మెచ్చరాదా? నాటి అధ్యక్షుల పరిసమాప్తోపన్యాసము వినదగింది.

**50 ఏళ్ల క్రితం ఈవారం**

# 'గ్రేడింగ్' పద్ధతి ఎక్కడా లేదు!

15 వ తేది నెల్లూరులో జరిగిన చెరకు రైతుల మహాసభలో బయటనుండి వచ్చిన పెద్దలు శ్రీయుతులు ఎం. నాగారెడ్డి, ఎం. నారాయణరెడ్డి, వై. వి. కృష్ణారావుగారల తోటి మొత్తం ఎనిమిదిమంది ఉపన్యసిస్తే అందరినోట ధ్వనించింది ఒకటేమాట. ఎవడీ ఎం. డి. రైతులమీద పెత్తనం చెలాయించడానికి అనేదే! వాటాదారుగా ఫ్యాక్టరీ యజమానులు చెరకు ఉత్పత్తిదారులు; ఎం. డి. కాని, మరొకరుగాని వారి కాలేవారు అనే మాటకూడా ఉపన్యాసాల్లో ప్రతిధ్వనించింది. ఒక్క మాటలో చెప్పాలంటే 15 వ తేది సభ కోవూరు చక్కెర ఫ్యాక్టరీ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ అరుణకుమార్ మానేమీద రైతుల తీవ్రమైన అభిశంసన; ఒకవిధంగా తిరుగుబాటని చెప్పవచ్చు.

సాధారణంగా రైతుసభలకు రైతులు రారు; సమస్యలపై తీవ్రమైన ధోరణిలో చర్చలూ జరగవు; రైతుల వ్యవహారమంటే కొందరు జంగాల సామెతగా వుంటుందనుకోండి! ఆ పాత సాంప్రదాయానికి మినహాయింపు, కొత్త మార్గానికి ముక్తాయింపు ఈ చెరకు రైతులసభ అనిపించింది. ఎందుకంటారా? ఆదివారం మొదలు ఎడతెరిపిలేని వర్షం; చాలచోట్ల పెక్కుమంది రైతులకు నోటికాడికొచ్చిన పంట నేలపాలై దిక్కుతోచని పరిస్థితిలో వున్న విషమ సమయం. అటువంటి పరిస్థితులను కూడా లెక్కచేయకుండా అంతమంది రైతులు సభకు వచ్చారంటే

> "రైతులమీద పెత్తనం చేయడానికి ఈ ఎం. డి. ఎవడు?"
>
> ○ ○ ○
>
> **చెరకు రైతుల సభలో ఏక కంఠంగా ఒకేమాట!**

లేనే చెరకుఫ్యాక్టరీ మేనేజింగ్ డైరెక్టరు రైతులను ఎంతక్షోభ పెడుతున్నది, వారిని ఎంత ఆందోళనపాలు చేస్తున్నది విదితమవుతుంది. రైతుల ఆగ్రహావేశాలు చూసినా, స్థానిక వక్తలలో ఒకరు చెరకు కొట్టకుండా బంద్‌చేసి తమశక్తి చూపించాలనే పిలుపునివ్వడాన్ని గమనించినా ఈ ఎం. డి. క్రింద ఈ క్రషింగ్ సీజను సాఫీగా జరుగుతుందా, మధ్యలో మూతపడుతుందా అనే అనుమానం కలుగకపోవడంలేదు.

విధానాలలోనేకాదు, ఈ ఎం. డి. వ్యక్తిగతంగా కొన్ని వ్యవహారశైలి కూడా అనుసరిస్తున్నారా అనుకోవడానికి ఆస్కారం కలుగుతున్నది. అతను విభజించి పాలించే విధానంలో రైతులను చీల్చడానికివిశ్వప్రయత్నంచేస్తున్నారు. ఎవ్వరైనా, స్వార్థాలకు లోబడిపోయే స్వాములుకొందరువుండకుండాపోరుగదా! అట్లనే ఎంత నష్టానికి నిష్ఠూరానికి గురికావలసివచ్చినా నిజాయితీగా నిలబడేవారూ వుంటారు! 15 వ తేది సభ సందర్భంలో చెరకు అభివృద్ధిమండలి అధ్యక్షుని హోదాలో శ్రీ దొడ్ల రమణారెడ్డి పేరుతో ఒక కరపత్రం పంపకమైంది; అదీ రైతుల్లో అలజడికల్గిస్తున్న, అందోళన రేకెత్తిస్తున్న గ్రేడింగు సమస్యమీద! సి. డి. సి. వుండగలిగితే రైతులపక్షంగా వుండాలి; వారి శ్రేయస్సుకు పాటుబడగలిగివుండాలి; అంతేకాని మేనేజింగ్ డైరెక్టరు లేక మరొక అధికారి కీలుబొమ్మ

—కొరవ 8 వ పేజీలో

## పినాకినీ తీరం

### ప్రొఫెసర్ శేషాద్రి వచ్చిపోయాడు!

తన "నెల్లూరు జ్ఞాపకాలు"తో జరనై వారాలుగా జమీన్‌రైతు పాఠకులను అలరిస్తున్న ప్రొఫెసర్ కందాడై శేషాద్రి గతవారంలో నెల్లూరు వచ్చిపోయారు. ఎందరు ప్రొఫెసర్లులేరు, ఎందరు రావడంలేదు, ఎందరు పోవడంలేదు, ఇదొక పెద్ద విశేషమా అని ప్రశ్నించే విశ్లేషకులు వ్యాఖ్యాతలుకూడా వుండకుండాపోరు.

శ్రీ శేషాద్రిని నేను విద్యార్థిగా చూడాను; నలభైఏళ్లతర్వాత మరలా ఇప్పుడు చూచాను. అప్పుడు ఖద్దరు పైజమా, లాల్చీతో సన్నగా అతి చలాకీగా నవ్వుతూ నవ్విస్తూ స్నేహశీలిగా వుండేవాడు శేషాద్రి. ప్రతిష్ఠాకరమైన జవహర్లాల్ నెహ్రూ యూనివర్సిటీ ప్రొఫెసర్‌గా రిటైర్ కావడమేకాక, దేశదేశాలు తిరగడమేకాక, బహుగ్రంథరచన సాగించిన మేధావి ఆయన. అంత ఎదిగిన శేషాద్రిలో ఈనాడూ వయసులో, వస్త్రధారణలోతప్ప, అప్పటికి ఇప్పటికి మరెందులోనూ తేడాలేకపోవడం ఆశ్చర్యం కల్గిస్తుంది. అటువంటి మాన్యమిత్రుణ్ణి కలుసుకోవడం నావరకు నాకైనా విశేషంకాదంటారా?

అరవైఏళ్లనాటి నెల్లూరు సంగతులను ఒక్కటీ తప్పిపోకుండా నెల్లూరు నుడికారంలో తన సహజమైన చమత్కారశైలిలో వివరించి, వర్ణించి పాతతరాన్ని కొత్తతరానికి, పాతకాలాన్ని కొత్తకాలానికి ముడివేసి చెప్పి మరచిపోయిన పాతకాలం ఘటనలను జ్ఞాపకం చేయడంద్వారా ఆ తరంవారిని, అప్పటి పరిస్థితులను ఎరిగించడంద్వారా నేటియువకులను శ్రీ శేషాద్రి తన వ్యాసాలద్వారా మురిపించి జమీన్‌రైతు పాఠకులకు సన్నిహితులయ్యారు. శేషాద్రి రాక ముందుతెలిసి వుంటే, ప్రొగ్రెసివ్ యూనియన్ వంటివారు టవున్‌హాలులో సభ పెట్టివుంటే ఆయనని వినడానికి తక్కువమంది వచ్చివుండేవారుకాదు.

శేషాద్రి ధారణాశక్తి అసాధారణమని చెప్పితీరాలి. ఉపాధ్యాయులు,విద్యార్థుల నుండి ఎంతోమంది పెద్దచిన్న వ్యక్తులు, సంఘటనలు ఎన్నెన్నో డైరీ గియిరీ సహాయంలేకుండా, కేవలం జ్ఞాపకశక్తి మీద ఆధారపడి ఒక్కటి తప్పిపోకుండా అంత ఆసక్తికరంగా, ఉత్కంఠను రేకెత్తించే నవలవలె, నెకుప్ప- నప్పెనుప్ప సన్నివేశాలతోకూడిన సినిమావలె అద్యంతాలు పట్టుసడలకుండా పాఠకులచేత చదివింపగలిగినప్రజ్ఞ శేషాద్రికే చెల్లిందా అనిపించింది.

శేషాద్రి పుట్టింది పెరిగింది నెల్లూరే; కాని అతని కుటుంబం తెలుగుకుటుంబం కాదు. బహుశా అతని సతీమణికి తెలుగు రాదనుకుంటాను, ఇంట్లో అందరూ తమిళం మాట్లాడుతారు. అతను నెల్లూరు వదలి నాలుగు దశాబ్దాలైంది. మధ్యలో ఒక్కసారి కాబోలు వచ్చి వెళ్లిపోయాడట. ఆయన బంధువులంటూ నెల్లూరులో ఎవ్వరూ లేరు; మిత్రుడుగా శ్రీ అనంత

....కొరవ 10 వ పేజీలో

# నోటికందిన పంట నేలపాలైపోయింది!

ప్రకృతి రైతును తరిమి తరిమి కొడుతున్నది. చెప్పుదెబ్బలు కొడుతున్నది, వెక్కిరిస్తున్నది, సాధిస్తున్నది, చివరకు ఆకలికోతకు గురిచేస్తున్నది! ప్రకృతి అనుగ్రహించేదు, ప్రభుత్వ సానుభూతి లేదు; కడకు రైతుది దినదినగండమే అయింది, దిక్కులేని దారులవుతున్నది!

భగవానుడు ఆగ్రహం తెచ్చుకుంటాడా? కోతకువచ్చిన పైరు జలసమాధి అయిందా? కోసిన ఓదెలు వర్షపు నీటిలో తెప్పతిరునాళ్లు ఆడాయా? సమయం, కాల్వలు పొంగి రాక పోకలను బంద్ చేశాయా?

లేదు. లేనేలేదు. మొలగొలుకు కోతల

## కన్నీరు కారుస్తున్న మొలగొలుకు రైతు!

లేకుంటే మొరట్లో వర్షాభావమా, వరదల ప్రమాదమా, మంచినీటికైతం అలమటింపా? వెనకటిక్కి మూడుసార్లు అతివృష్టా, వెల్లువలా, అసహజపు జల ప్రళయమా? మన వూహ అందినంతలో జనవరిలో ఐదు రోజులపాటు ఎడ తెరిపిలేకుండా వర్షం కురిసిందా? సూర్య సమయంలో పలపల నాలుగు చినుకులు పడడం, ఓదెలు తడవడం, వెంటనే తీవ్రంగా ఎండ కాయడం, తడిసిన ఓదెలు కాస్త ఎండగానే రైతులు కుప్పలేసుకోవడం జరుగుతుండేది, అదీ ప్రతిసంవత్సరమూ కాదు; ఎప్పుడో ఏందో! ఆ పరిస్థితికే ఒక సామెతకూడా పుట్టింది-మూల



నెల్లూరుకు మైలుదూరంలోనే వర్షపు నీటిలో (15 తేది) తెప్పతిరునాళ్లగా వున్న కోసిన మొలగొలుకు వోదెలు.

కార్తె ముంచుతుందని సామెత. అప్రకారమైనా ఈ సంవత్సరం మూలకార్తె డిసెంబరు 28 తేదితో పోయింది. అటువంటిది జనవరి 12 నుండి 16 తేది వుదయం వరకు ముసారావేసి ముంచిందంటే అదున్లు, కార్తెలు గతి తప్పాయనే అనుకోవాలి; ప్రకృతికి మతిపోయిందనే అనుకోవాలి! ఈ విడ్డూరానికి, వైపరీత్యానికి ఇంతకంటే ఏమి భాష్యం చెప్పుకోగలం?

ఎక్కడ్నో శ్రీలంక వద్ద వాయుగుండం ఏర్పడితే అదిఇక్కడ నెల్లూరుకు గండంగా పరిణమించడమేమిటి? ఆదివారంరోజు అకస్మాత్తుగా సూర్యుడుమరుగైపోయాడు; ఆకాశం మబ్బులు కమ్మేసింది; సన్నచినుకులు ప్రారంభమయ్యాయి. క్షణం విడుదల లేదు-చినుకులు పెద్దవికాదు; 13 తేది, 14 తేది పగలు అంతే; 14 రాత్రి కుంభవృష్టి, 15 తేది వుదయం పది గంటల వరకు అట్లనే నిల్చికురిసింది

పంటపొలాలు జలమయ మయ్యాయి కోసినపైరు నీట తేలియాడింది, ఈరోజు (17 తేది) వరకు నీటమునిగిన పైరుకు విముక్తి కలుగలేదు. వర్షం ఆగింది కాని, ఈ నగాచి నక్కలపాలైసినట్లుగా ఆరు మాసాలు పెట్టుబడిపెట్టి, పెంచి పండించి నోటికందే సమయంలో నేలపాలుకాగా, రైతుల కండ్లనీరుమాత్రం కడవలు నిండుతూనే వుంది!

—కొరవ 6 వ పేజీలో

# నెల్లూరు చుట్టుపట్ల

విశ్వకర్మకుడు

జి. ప. క

ప్రద్దరు మొగుళ్లు!

నెల్లూరు జిల్లాపరిషత్ ఛైర్మన్ అనే ఒక స్త్రీ కాంతకు ఇప్పటికిద్దరు మొగుళ్ళు! ఇద్దరు భర్తలతో ఆ మహాసాధ్వి ద్రౌపదిలాగా ఎట్లా సంసారం చేసిందో కాని, ఈ జి.ప. పతివ్రతాంతమాత్రం ఇద్దరితోనే కాపురం చేయలేక తికమక పడుతూంది: క్రింద మీకొలతంది.

ఛైర్మన్ బాలచెన్నయ్యను అవినీతి ఆరోపణలసాకుతో ప్రభుత్వం సస్పెండ్ చేయడాన్ని హైకోర్టు స్టేతో నిలిపింది; దానితో ఆయన 9 తేది తిరిగి ఛార్జీ తీసుకున్నారు. కాని స్టే ఉత్తర్వు అస్పష్టంగా వుండడంతో అధికారులు తికమక పడిపోయారు. ఇదే అవకాశంగా తీసుకుని వైస్ ఛైర్మన్ శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి మొదట ప్రభుత్వ ఉత్తర్వుప్రకారం తానే ఛైర్మన్ అని దబాయింపుకు దిగాడట. ఈ చిక్కుముడి విప్పమని డిడిఒ ప్రభుత్వానికి ప్రత్యేకదూత ద్వారా విన్నపం పంపుకొనివున్నారట కాని, వారేమీ ఇప్పటివరకు ప్రత్యుత్తరం ఇచ్చినట్లు లేదు.

ఈలోగా తాత్కాలిక ఏర్పాటుగా కాబోలు, డిడిఒ ఇద్దరు ఛైర్మన్లనూ తీసుకొచ్చి ఆఫీసులో కూర్చోబెట్టారు. ఛైర్మన్ ఛాంబర్స్ బాలచెన్నయ్య ఆక్రమించారు అందువల్ల ఎన్నికకి దానిముందే వున్న స్టాండింగ్ కమిటీల సమావేశం గదిని కేటాయించారు. ఇద్దరికి చెరొక క్యాంపు క్లర్కును ఇచ్చారు. ఛైర్మన్ కారు బాలచెన్నయ్య తీసుకున్నారు; డిడిఒ కారు శ్రీనివాసులు రెడ్డి వాడుకుంటున్నారట. హైకోర్టుమాత్రం, డిడిఒ ఆదేశంపై శ్రీనివాసులు రెడ్డికే పంపబడుతున్నాయని, బాలచెన్నయ్యకు కుర్చీ, కారు తప్ప మరేమీ ఇవ్వడంలేదనితెలుస్తూంది. ఇంకా విగ్రహమయమైనట్టి ఇక్కట్లు అధికారంగా బాలచెన్నయ్యను ఛైర్మన్‌గా గుర్తిస్తే, డిసిఒ మాత్రం శ్రీనివాసులురెడ్డికి సెలవు కూడా పులుముతున్నారట. గవర్నరు పర్యటనలోకూడా బాలచెన్నయ్యకే ఆహ్వానాలు, వరల్లో గుర్తింపు లభించాయి.

ప్రభుత్వం శ్రీనివాసులురెడ్డినే ఛైర్మన్‌గా గుర్తించమని ఆదేశాలు జారీ చేసినట్లు వార్తలొచ్చాయి కాని, అది నిజంకాదని తేలింది. ఈ విషయంలో ప్రభుత్వ వివరణ వ్యర్థం; హైకోర్టునుండే ఏ ఆదేశమైనా, వివరణఅయినా అందాలి. అప్పటివరకు ఈ గందరగోళం తప్పదు.

## వర్షపాతం

12 మొదలు 16 తేది వరకు వివిధ ప్రదేశాలలో వర్షపాతం—

| | | |
|---|---|---|
| సూళ్లూరుపేట | 306.2 | మి. మీ. |
| కోవూరు | 246.0 | ,, |
| వెంకటగిరి | 232.3 | ,, |
| నెల్లూరు | 226.5 | ,, |
| ఆత్మకూరు | 190.0 | ,, |
| గూడూరు | 173.0 | ,, |
| పొదలకూరు | 167.4 | ,, |
| నాయుడుపేట | 154.5 | ,, |
| కావలి | 154.0 | ,, |
| ఉదయగిరి | 91.2 | ,, |
| రాపూరు | 87.5 | ,, |

## స్వామి దయానంద

రుషికేశ్ ఆర్ష విద్యాపీఠాధిపతి శ్రీ దయానంద సరస్వతి భగవద్గీతోపన్యాసాలు, టౌన్‌హాలులో జనరంజకంగా జరుగుతున్నాయి.

స్వామీజి ప్రసంగాలు సులభమైన, సరళమైన ఇంగ్లీషులో సుబోధకంగా చక్కగావున్నాయని అందరూ ప్రశంసిస్తున్నారు.

## యూత్ కాంగ్రెస్

రాష్ట్ర యూత్‌కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ వాలి సూర్యభాస్కరరావు 20 తేది నెల్లూరు వస్తున్నారు. బహుశా జిల్లా అధ్యక్ష వరణం జరగవచ్చు.

జి. కాం. అధ్యక్షతకు వలె దీనికి అప్పుడే చలనం కనబడుతుంది. ప్రస్తుతానికి ముగ్గురు అభ్యర్థులు ముస్తాబుగావించబడుతున్నట్లుంది. ఒకర్ని సంజీవరెడ్డిగారు ప్రోత్సహిస్తున్నారట; మరొకర్ని కె. వి. సుబ్బారెడ్డిగారు 'ప్రాజెక్టు' చేస్తున్నారట; మూడవవారిని ఇంకోవర్గం బలపరుస్తున్నదట. భాస్కరరావుగారి నిర్ణయం ఎట్లా వుండబోతుందో తెలియదు.

ఎవరినైనా మంచివాణ్ణి నిర్ణయించండి. ధూర్తులను, వేషగాళ్ళను, దుందుడుకు వ్యక్తులను దూరంగా పెట్టండి బాగుంటుంది!

## దంత వైద్య శిబిరం

ప్రఖ్యాత దంత వైద్యుడు డాక్టర్ జి. కొండారెడ్డి లైన్స్‌క్లబ్, డెంటల్ కేర్ అసోసియేషన్ ద్వారా నెల్లూరీయులకు ఉచితంగా దంతవైద్యనిపుణులసలహా చికిత్సా సౌకర్యాన్ని కల్గిస్తున్నారు.

ఈ నెల 25, 26 తేదులలో వి. ఆర్. హైస్కూలులో శిబిరంఏర్పాటుచేస్తున్నారు. 25 తేది స్కూలుపిల్లలకు, 26 తేది పెద్దవారికి పరీక్షచేసి చికిత్సలు, సలహాలు ఇవ్వబడుతాయి. ఈ శిబిరానికి హైదరాబాదు డెంటల్ కాలేజిలోని వివిధ విభాగాలకు చెందిన నిపుణులు హాజరౌతున్నారు.

ఈఅపూర్వావకాశాన్ని నెల్లూరీయులు పూర్తిగా వినియోగించుకోవాలి!

## నీటి మట్టం

| | |
|---|---|
| కలిగిరి రిజర్వాయరు | 21.35 అ. |
| సర్వేపల్లి | 10.50 అ. |
| నెల్లూరు చెరువు | 16.90 అ. |

ఏటికి నీళ్ళువదిలారు: సంగం ఆనకట్టమీద 1.5 అ., నెల్లూరు ఆనకట్టమీద 1.4 అ. నీరువుంది.

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు | (9672) | 1750.00 |
| ,, | (9674) | 1800.00 |
| ,, | (క్రొత్తవి) | 1350.00 |

## ఇండ్లస్థలం అమ్మబడును

నెల్లూరు, దర్గామిట్ట, సరస్వతినగర్ హెల్త్ ఆఫీసరు రంగారావుగారి, ఇంటికి దక్షిణ వైపున 38అంకణముల ఖాళీస్థలం అమ్మబడును.

వివరములకు

**పి. రామచంద్రారెడ్డి**

అసిస్టెంటు ఇంజనీరు

15/363, సుబేదారుపేట—నెల్లూరు

## ఆధ్యాత్మిక ఉపన్యాసములు

పూజ్యశ్రీ కాశీనాధుని సాంబశివరావు గారిచే 20-1-86 నుండి 31-1-86 తేది వరకు స్టోన్‌హౌస్‌పేట గీతామందిరములో ఉదయం 6-30 నుండి 8-00 గం॥ వరకు ప్రశ్నోపనిషత్ సాయంత్రం 6-30 నుండి 8-00 గం॥ వరకు కఠోపనిషత్ ప్రవచనము జరుగును. కావున జిజ్ఞాసువులందరు విచ్చేయ ప్రార్థన.

సాధుభక్తమండలి

నెల్లూరు-2.

C/o. శ్రీసుందరీ క్లాత్ మార్ట్

కాపువీధి, నెల్లూరు-1.

పెన్నా ఉత్తరపు ఒడ్డునవున్న గాంధీ గిరిజన సంఘంలోని ఒక ఇంట్లో బుట్టలల్లే విధానం అడిగి తెలుసుకుంటున్న గవర్నర్ కుముద్‌బెన్‌జోషి. కలెక్టర్ జన్నత్ హుసేన్, ఆర్ డి ఓ నాగేశ్వరరావు గారలుకూడా చిత్రంలో వున్నారు.

# ఋణాల రద్దే రైతుకు ఊరడింపు!

(5వ పేజీ తరువాయి)

వర్షపాతపు వివరం వేరుగా ఇస్తున్నాము: దాన్నిబట్టే కోతసమయంలో ఎంతనష్టం సంభవించి వుంటుందనేది వూహించుకోవచ్చు. కలెక్టర్ జన్నత్ హుసేన్, ఎస్. పి. గిరీష్‌కుమార్, నెల్లూరు ఆర్. డి ఒ. డాక్టర్ నాగేశ్వరరావు, వ్యవసాయశాఖ జాయింట్ డైరెక్టరు వాసుదేవరెడ్డి, వరి పరిశోధనాలయం అధిపతి జి. వెంకటేశ్వరరెడ్డిగారలు 15, 16 తేదులలో కోవూరు, నెల్లూరు, కావలి ప్రాంతాలలో పర్యటించి నష్టాలను స్వంతకంటితోచూచినట్లుంది. వారు చూడగలిగింది ప్రయాణించిన రోడ్లకిరువైపులే కాని, లోపలసంగతి వారికి తెలిసే అవకాశంలేదు.

కోసి నీళ్ళలోవున్నపైరు తక్కువని వాసుదేవరెడ్డిగారి అభిప్రాయం. కాని మఖకార్తెలో నాటినదానిలో అధికభాగం కోయబడివుండాలి; అది ఎన్ని ఎకరాలుగావుంటుందనేది ఇప్పుడే ఎవ్వరిఅంచనాలకు అందదు. ఇక కోయకుండా నీటమునిగి దెబ్బతిన్నపైరు రెండున్నర లక్షల ఎకరాలుగా వుంటుందని అంచనా. కోసి నీటిపాలైనా, కోయకుండా నీటమునిగినా హెచ్చు, తక్కువ అనేది తప్ప నష్టం నష్టమే. 9672 రకం సహజలక్షణం గింజ రాలుడు: తడిసింది కాబట్టి ఆ రాలుడు అత్యధికంగా వుండవచ్చు. ఆ రాల్పు 40, 50 శాతం వుండవచ్చునని వ్యవసాయ శాస్త్రజ్ఞుల అంచనా. మొలగొలుకు వేతకు వర్షము, మునకలవల్ల నష్టంలేదుగాని, ఉష్ణోగ్రత అతితక్కువగా వున్నదికాబట్టి మెడవిరుపు తదితర తెగుళ్ళు ఎక్కువగాఆశించవచ్చునంటారు; ఐ. ఆర్. 20 కి పెద్దగా నష్టం వున్నట్లులేదు. కాని దానికి దోమ కాటువంటి తెగుళ్ళ ప్రమాదం లేకపోలేదు.

కోసిగాని, కోయకగాని నీటిపాలై రాల్పువల్ల, మక్కినందువల్ల, తెగుళ్ళవల్ల దేనివల్లనైతేనేమి ఎకరాకు రూ 500 లు నష్టం వుంటుదనుకున్నా, మొత్తం నష్టం పదిహేను కోట్లకు తక్కువ వుండదు,

## వాతావరణం

నెల్లూరుటవున్ అధిక అల్పఉష్ణోగ్రత, గాలిలో తేమశాతం దిగువ ఇస్తున్నాము,

| తేది | పగలు | రాత్రి | గాలిలో తేమ |
|---|---|---|---|
| 12 | 82 | 70 | 78% |
| 13 | 77 | 70 | 98% |
| 14 | 73 | 66 | 100% |
| 15 | 75 | 72 | 100% |
| 16 | 77 | 64 | 94% |

కొన్నిచోట్ల వేరుసెనగ, మిరప దెబ్బతినిపోయాయి: వాటి నష్టం అంచనాకు అందదు. అట్లనే కోతకువచ్చిన మొలగొలుకులు పెసర, పిల్లిపెసర, మినుము చల్లి వున్నారు; వాటిలో ఒక్కగింజ పనికి రాదు, మళ్ళీ చల్లుకోవాలి. అట్లనే మెట్ట తాలూకాలో పెసర,మినుము ప్రత్యేకంగా చల్లి వున్నారట; అదీ దెబ్బతినిపోయి వుంటుంది. వీటి నష్టంకూడా తక్కువ కాదు. అన్నీ కలుపుకుంటే ఈ వారం వర్షంవల్ల నష్టం కోట్లలో ఖచ్చితంగా లెక్కపెట్టలేకపోయినా, అపారంగా వుండగలదని దృఢంగా చెప్పవచ్చు.

జనార్దనరెడ్డి ప్రకటించినట్లు మూడేళ్ళలో ఆరు ప్రకృతి ప్రళయాలకు గురియైన జిల్లా మరిఒకటిలేదు. ఈ కాన్సరుతుపవనంవల్ల ప్రతిఏడూ ఇంతగా దెబ్బతిని పోతున్న జిల్లాకూడా రాష్ట్రంలో నెల్లూరొక్కటే. రైతాంగానికి ఇంత విపత్తు సంభవిస్తే రాష్ట్ర ప్రభుత్వ పాలకు ఒక సానుభూతిమాటకూడా అనకపోవడం శోచనీయమని జనార్దనరెడ్డి అన్నాడంటే, సత్యమైనమాట. ఆయన కోరినట్లు చితికిపోయిన నెల్లూరు రైతుకు సహాయం చేయాలనే చిత్తశుద్ధి రాష్ట్ర ప్రభుత్వానికుంటే కేంద్ర ప్రభుత్వంతో సంప్రదించి, రైతుల అప్పులన్నిటిని వెంటనే రద్దు చేయాలి; ఆ నష్టాన్ని కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు భరించాలి. మహారాష్ట్రలో ముఖ్యమంత్రిగా అంతులే చూపిన తెగువను రామారావు చూపలేడా?

ఈ వర్షంవల్ల ఇళ్ళుకూలడంద్వారాను ఎముకలు కొరికే చలివల్లను వివిధప్రదేశాలలో నలుగురు స్త్రీలు, ముగ్గురు పురుషులు మరణించారు. రెండు మేజర్, 12 మైనర్ ఇర్రిగేషన్ చెరువులు; పదకొండు రింగు బండ్లు; రెండు ఫ్లడ్ బ్యాంకులు తెగిపోయాయి. అట్లనే గూడూరు-దుగరాజపట్నం, గూడూరు - తూపిలిపాళెం రోడ్లు గండ్లుపడ్డాయి. సూళ్ళూరుపేట వద్ద పాముల కాల్వవల్ల -నెల్లూరు మద్రాసు మధ్య, వెంకటగిరి మీదుగా నెల్లూరు తిరుపతి మధ్య వాహనాల రాకపోకలు ఒక రోజు ఆగిపోయాయి.

మొత్తానికి జనవరి వర్షం రైతు వెన్నెముకను విరగగొట్టింది; ఆర్థికంగా సంక్షోభ పరిస్థితులను కల్గించింది.

— మా. వి.

# నరుకూరులో ఒక రౌడీని మూకవుమ్మడిగా చంపారట!

ఇందుకూరుపేట తాలూకా నరుకూరులో 12 వతేది రాత్రి "సామూహిక" హత్య ఒకటి జరిగింది. నెల్లూరు కసుమ హరిజనవాడకు చెందిన జల్లపు ఆనంద్ అనే పేరుమోసిన రౌడీని గ్రామస్థులందరూ కలసి, మూకవుమ్మడిగా పైనబడి కర్రలతో, రాళ్ళతో, చేతులతో చితకబాది తరిమితరిమి కొట్టిచంపారట.

ఆనంద్, ఆ ప్రాంతంలో పేరుమోసిన గూండా అట. స్వస్థానం చింతారెడ్డిపాళె మైనా, ఏడెనిమిదేళ్ళక్రితం అక్కడేదో హత్యకేసులో ఇరుక్కుని, భయపడి ఇక్కడ కాపురం పెట్టాడట. ప్రతిరోజు నలుగురైదుగురిని తోడుతీసుకొని, నరుకూరు సినిమాహాళ్ళదగ్గర రౌడీ జం చేయడం అతడికి నిత్యకృత్యమట. అతనికి భయపడి, అతనిమూకకంతటికీ నరుకూరు సారాయి అంగళ్ళనుంచి బంకులదాకా అన్నీ 'ఫ్రీ' గా సప్లయి చేసేవారట. 12 వతేది సాయంత్రం ఇదేప్రకారం ఒక చిన్న బంకు యజమానిని వీరు నలుగురు కలసి కొట్టారట. అప్పుడే సినిమా వదలడంతో, ఆ జనం, చుట్టుప్రక్కల వుండే గ్రామస్థులు ఈ అరాచకాన్ని సహించలేక, ఎప్పటినుంచో పేరుకునివున్నకసిని వెళ్ళగ్రక్కుతూ, వారిని తరిమితరిమి కొట్టారట. గుంపులో ఎవరెవరు నిజంగా కొట్టారో, ఎవరు గమ్మున చూసి వినోదించారో తెలియదుగాని, ఆ మూక దెబ్బలకు ఆనంద్ అక్కడికక్కడే చచ్చాడట; అతనితోటి వుండిన శ్రీనివాసులు, నరసింహం అనే ఇద్దరిని గాయాలతో ఆసుపత్రిలో చేర్చారు; మరొకడు ఒక గుడిసెలో, గడ్డిక్రింద దాక్కుని జనం దాడి తప్పించుకున్నాడట.

ఒక విరళమైన ఆవేశంతో, ఉద్రేకంతో, ఉన్మాదంతో, భరించరాని కసితో జరిగిన హత్య ఇది. సంవత్సరాల తరబడి జరుగుతుండిన ఆకతాయితనాన్ని, దౌర్జన్యాలను మౌనంగా సహిస్తూ, బద్దలైన అగ్నిపర్వతం మాదిరి విరుచుకుపడ్డారు గ్రామస్థులు. నిజానికి, వ్యక్తిగతద్వేషంతో చేసినా, సామూహిక ఉద్రేకంతో చేసినా హత్య హత్యే! అయితే ఆనంద్ వంటి దుండగుల దౌర్జన్యాలనుంచి ఎన్నేళ్ళు గడచినా రక్షణ లభించని నిస్సహాయతతో, గదిలో పెట్టిన పిల్లివలె తిరగబడినట్లున్నారు జనం.

ఈ హత్య విచారణచేయడం పోలీసుకు పెద్దసమస్యగా పరిణమించినట్లుంది. ఎవర్ని విచారిస్తారు, ఎవరిపై నిందమోపుతారు? అప్పటికీ రోజూ రాత్రి పూట ఆవూరికివెళ్ళి, కన్పడినవారినంతా తీసుకొచ్చి లాకప్‌లో పెడుతున్నారట. ఆవేశం తగ్గిన గ్రామస్థులిప్పుడు, పోలీసులకు భయపడి ఊరు వదిలి వెళ్ళుతున్నారట ఈసమస్యను పోలీసులు మెలకువగా, నేర్పుగా పరిష్కరిస్తే గొడవ వుండదు; తొందరపడితే రచ్చ రేగిపోతుందంటారు ఆ గ్రామస్థులొకరు.

## జిల్లావార్తలు

### మైపాడు డాక్టర్లు

మైపాడు ప్రాథమికఆరోగ్యకేంద్రంలో పేరుకు ముగ్గురు డాక్టర్లున్నా, ఒక్కరూ ఊళ్ళో కాపురంలేరట. ఇద్దరు మగ డాక్టర్లు వారానికి రెండుసార్లు విజిట్‌కు వచ్చినట్లువచ్చి, ఒక గంట కూర్చొని వెళుతున్నారట. డాక్టర్ల క్వార్టర్లు పందులు పశువులకు ఆశ్రయమిస్తున్నాయట. మామూలుకేసులు నర్సులేచూచి, మందులిస్తున్నారట; కొంచెం సీరియస్ అయితే నెల్లూరుకు పరుగెత్తవలసిందేనట. గగ్గోలుగా వుంది మైపాడులో! డి ఎం ఓ గారు గ్రామస్థులగోడు వినాలి.

### కావలి వైద్యశిబిరం- ఎందుకీప్రహసనం?

కావలి లియోక్లబ్ ఇటీవల తుమ్మలపెంటలో ఉచిత వైద్యశిబిరం ఒకటి నిర్వహించింది. మధ్యాహ్నం 2 నుంచి సాయంత్రం 5 గంటల వరకే శిబిరం. 10 మంది డాక్టర్లు 650 మంది రోగులను పరీక్షించారట. మూడుగంటల్లో అంతమంది రోగులను పరీక్షించడం ఎట్లాసాధ్యం? క్లబ్‌ల వైద్యశిబిరాలు ప్రహసనాలైపోతున్నాయి. ప్రచారమే వీటికి పరమావధిగావుంది. —

# అధికార అట్టహాసాలు- ఆప్యాయంగా పలకరింపు!

రాష్ట్ర గవర్నర్ శ్రీమతి కుముద్ బెన్ జోషి (ఆమె "కుమారి" అయినా వయసు పెద్దది కాబట్టి "శ్రీమతి" అని సంబోధించాలని రాజ్‌భవన్ శాసించిందట) రెండు రోజులపాటు జిల్లాలో పర్యటించి వెళ్లారు: సాధారణంగా గవర్నర్ల కార్యక్రమాల్లో లాంఛనాలకే ప్రాధాన్యత ఎక్కువ. బ్రిటీషు వారి పూర్వ్వదశకానికి శిథిలచిహ్నం గవర్నర్ల వ్యవస్థ. ఆ దాశరికపు సాంప్రదాయాలు మనల్ని వీడనంటున్నాయి.

జోషీగారి పర్యటనలోకూడా ప్రొటోకాల్ నిబంధనలను కలెక్టర్ శ్రీ జన్నత్ హుసేన్ తుచ తప్పకుండా ఆచరించారు. ఆమె విడిది దిగిన ఆర్ అండ్ బి అతిథి గృహంలో అతిథులకే ప్రవేశం: పైగా వారిపేర్లు నిషిద్ధవస్తువుల్లో పైనే ఉన్నాయని, కుర్చీలకు అతికించారు. జిల్లా అధికారులకు ఫుల్ సూట్ యూనిఫారంగా నిర్దేశించారట: పాపం పెట్టెల్లో అడుగునపడి చిరిగిపోయిన సూట్లతో బిగదీసుకునివచ్చిన అధికార్లనుచూస్తే నవ్వొచ్చింది. సూటు వేయనిదే "నాగరికత" కాదనే వలస రాజ్యాల మనస్తత్వంనుంచి ఇంకా బయట పడలేకున్నాం మనం. పోలీసు బందోబస్తు సరేసరి.

ఇంతాచేస్తే గవర్నరుగారు మాత్రం ఈ "బంగారు పంజరాన్ని" చేత్తో ప్రక్కకునెట్టి జనంతో కలసిపోయారు. జోరున వర్షం, నేలంతా రొచ్చు బురద, వణికించే చలినికూడా లెక్కచేయకుండా ఆమె సాధారణ సంఘసేవికవలె తిరిగారు. ఆమె పర్యటనలో ఎక్కడా ప్రసంగాలకు ప్రాధాన్యంలేదు; స్వాగత సత్కార సన్మానాదులకు విలువివ్వలేదు; అధికార లాంఛనాలను లెక్కచేయలేదు. కలెక్టరాది అధికారులేకాదు, మన రాజకీయ నాయకులు కూడా ఆమెతో పరుగులు పెట్టలేక అలసిపోయారంటే నమ్మండి. అదేమి చలాకీతనం, అదేమి ఓపిక!

గవర్నర్ కార్యక్రమం 13 తేదీ ఉదయం సూళ్ళూరుపేట సమీపంలోని

### జడివానలో గవర్నర్ పర్యటన

వెంగమాంబాపురంలో ప్రారంభమైంది. ఇక్కడ 40 ఎకరాల స్థలంలో 300 మంది బలహీనవర్గాల యువకులకు శిక్షణ, ఉపాధికల్పనకల్పించే "ప్రగతి" పథకానికి ఆమె శంకుస్థాపించారు. దీనికి 75 లక్షలు ఖర్చవుతుందట. 300 మందికీ ఇక్కడే ఇళ్ళు, స్కూలు, ఆసుపత్రి వగైరాలు కట్టిస్తారట.

సాయంత్రం, వెంకటేశ్వరపురంలోని గాంధీ గిరిజనసంఘం సందర్శన; అప్పటికే వాన కుండపోతగా కురుస్తోంది. గవర్నర్ ప్రత్యర్థం రోడ్లోపోలిన ఎర్ర మట్టి, బురదగామారి, కాలుపెడితే సర్రున జారుతూంది. అయినా గవర్నర్ ఇళ్ళిళ్ళు తిరిగారు. గొడుగుకూడా పట్టనివ్వలేదు. గుడిసెల్లోకిదూరి, కుటుంబీకులతో ఆప్యాయతతో మాట్లాడి, వారి జీవనపరిస్థితులు తెలుసుకున్నారు, కాలనీలోని యునాని ఆస్పత్రి, కుట్టు శిక్షణాకేంద్రం తిలకించారు. తర్వాత వడుగుపాడు కలంకారీ కేంద్రం సందర్శన. అక్కడా చీరెలు, వాటికి రంగులద్దే విధానం, మూలికల వివరాలు అడిగి తెలుసుకున్నారు. అక్కడినుంచి, సుబేదారుపేటలోని ఆదిమ జాతి సేవక్‌సంఘ్ హాస్టలు, గిరిజన భవనాలను చూశారు. అక్కడి పిల్లలను ఆప్యాయంగా పలకరించారు. గాంధీ గిరిజన సంఘంలో బహిరంగసభకు ఏర్పాట్లుంచినాయికాని, ఆమె మాట్లాడలేదు. గవర్నర్ కార్యదర్శి, మాజీ నెల్లూరు జాయింట్ కలెక్టరు శ్రీ చంద్రమౌళి అరవయాసతో, వచ్చీరాని తెలుగులో నాలుగుమాటలు చెప్పారు.

6-30 కి టౌన్‌హాలులో గీతాజ్ఞాన యజ్ఞం ప్రారంభోత్సవం. భగవద్గీత గురించి నాకేమీ తెలియదని నిజాయతీగా ఒప్పుకుని, ప్రకృతి సంపద, పరిసరాల పరిరక్షణావశ్యకతలను నొక్కివక్కాణించి కూర్చున్నదామె. శ్రీ దయానంద సరస్వతి క్లుప్తంగా ప్రసంగించారు. యజ్ఞ ... ప్రహకుడు శ్రీ ఎం వి నారాయణ రెడ్డి స్వాగతించారు. చివర్నకళాక్షేత్రంలో

-తరువ 10వ పేజీలో

## ★ ★ నా మాట ★ ★

### మహానాడులో ఊడిగం చేసిన నెల్లూరు నాయకులు

రాజకీయవాదులకు ఆత్మగౌరవం ప్రాణం. అధికారాన్ని త్యజించడమే తప్ప, అమర్యాదను సహించడం పూర్వతరం నాయకులకు ఊహకుకూడాఅందని విషయం: మనజిల్లావరకే చూసినా, బెజవాడ గోపాలరెడ్డి, ఏ. సి. సుబ్బారెడ్డి రాజకీయ జీవితాలు ఎంత హుందాగా గడచాయి? ప్రధానమంత్రితోనయినా సమస్థాయిలో మాట్లాడడమేతప్ప, తలవంచి ఎరుగని ధీరుడు ఏ. సి. ఆటిపలి కాలంలో, కేంద్ర నాయకులనుకూడా పేరుపెట్టిపిల్చే చనువుతో రాజకీయాలు నడిపిన జనార్దనరెడ్డి సంగతి చెప్పనే అవసరంలేదు. చూసుకొనిపోవడంతప్ప దాస్యంచేయడం వీరెవరి తత్వంకాదు.

ఇప్పటి నాయకుల్లో? తెలుగుదేశం అధికారంలోకి వచ్చిన తర్వాత నాయకులకు, నౌకర్లకు తేడానే లేకుండాపోయింది మరీ మొన్నటి హైదరాబాదు మహానాడులో మంత్రులచేత మాత చిందులేయించి వినోదించిన చిన్నల్లుడిగారి ఘనత వార్తల్లో చదివాం కదా! ఈ "మూక"లో నెల్లూరీయులు కూడా వున్నారు.

పోలీసోడు కాకీ యూనిఫారమేనుకోవ డమంత మామూలైపోయింది. తెలుగు దేశీయులు పచ్చచొక్కా ధరించడం. మొదట మొదట అన్నగారు చెప్పవిడిచి లోపలకు రమ్మన్నాడని, తలతీసేసినంత అవమానంగా చిరుబురులాడిన పాపిరెడ్డిగారుకూడా ఇప్పుడు బుద్ధిగా పచ్చరంగు పులుముకుంటున్నారు పాపం. బొడ్డవారి దివాణం ప్రాభవం ఇప్పటి తరానికి తెలియదు కాబట్టి ఇప్పటి దుస్థితికిచింతలేదు.

మన మండల అమాత్యవర్యులుకూడా పచ్చరంగు చొక్కాను ఏమాత్రం సందేహించక స్వీకరించారట; ఆయనది రాజీతత్వం; అన్నగారు పటప్ అన్నా, ఆకే పెద్దపాగక్రింద పరిగణించే "వికాల

**డోలేంద్ర**

హృదయుడు". అసెంబ్లీలో పులిగర్జనలు, జైఆంధ్ర సింహ ఘీంకారాలంటారా- అవోక పీడకల.

వీరిద్దరే నయం-పచ్చచొక్కా తొడిగి దయతల్చినట్లు వదిలేశారు చిన్నల్లుడు; ఎమ్మెల్యేల దీనావస్థ వర్ణనాతీతం. రామనారాయణరెడ్డికి చేతికర్ర, నోటికి పీకిలి ఇచ్చి, "గేటుకు కాపలా" పెట్టారట. ఆయన తన అనుంగుసోదరుడు, మిత్రుల సహకారంతో చేపట్టిన కార్యాన్ని దిగ్విజయంగా నిర్వర్తించారట: బాబుగారి దాసానుదాసులు, మూదాసు గంగాధరం

-తరువ 10వ పేజీలో

# పట్టాభిషేకం కొనుగోలుదార్ల కొంపముంచింది!

మా మద్రాసు ప్రతినిధి

రామకృష్ణా సినీస్టూడియోసువారి చిత్ర మంటే ప్రేక్షకులలో మంచి ఎక్స్‌పెక్టేషన్ వుంది. అందునా రాఘవేంద్రరావు సమర్థుడైన దర్శకుడు. ఇక నందమూరి బాలకృష్ణకు ఉన్న ఫాలోయింగ్ అంతా ఇంతా కాదు. అందుకే విపరీతమైన రేట్లు చెప్పినా-కొనుగోలుదార్లు సిద్ధపడి "పట్టాభిషేకం" చిత్రాన్ని కొనుక్కున్నారు. మొదటి మూడురోజులు హాలు నిండడం సహజమే. ఆతర్వాత ఫ్లాప్ వచ్చిందట. కథలో కొత్తదనం లేకపోవడం ఒకకారణం అంటున్నారు కొందరు. మరేదో కారణమంటున్నారు మరికొందరు. ఏదిఏమైతేనేం, కొందరు కొనుగోలుదార్లు నష్టపడడమేకాక బాలకృష్ణ అభిమాన సంఘాలవారుకూడా అసంతృప్తి చెందుతున్నారట. తమాషాఏమిటంటే "పట్టాభిషేకం" చిత్రానికి భయపడి కొందరు నిర్మాతలు తమచిత్రాల విడుదలను వాయిదా వేసుకున్నారు. వీళ్ళందరూ ఆఖరిలో తమచిత్రాలను విడుదలచేయక తప్పదు. కొత్తసంవత్సరారంభంలోనే ఎన్నోచిత్రాలు ఒకదానిమీదొకటి పోటీగా విడుదలవనున్నాయి. జనం ఎన్నని చూస్తారు? మొత్తంమీద ఒకటిమాత్రం తేలిపోయింది. ఒక్క చిరంజీవితోతప్ప రాఘవేంద్రరావుకి మరే హీరో కాంబినేషన్‌లో వచ్చిన చిత్రమైనా అంతబాగా వసూళ్ళను చేసుకోవు.

## సినిమాలుచూసి నేరాలు

"పారిపోయిన ఖైదీలు" సినిమా చూసిన హైదరాబాదులోని శ్రీనివాస్ అనే యువకుడికి ఆచిత్రంలోలాగా దొంగతనం చేయాలనిపించింది. అలాగే డిసెంబర్ 6వ తేది రాత్రి అంబర్‌పేటలో వున్న ఓసేట్‌కీ కొట్లోంచి నలభైఐదువేల రూపాయల కిమ్మత్తుచేసే బంగారు ఆభరణాలను తస్కరించాడు. వెంటిలేటర్‌నుతెరచి ఆకొట్లో ప్రవేశించిన శ్రీనివాస్ ఆతర్వాత కటకటాలవెనక్కి చేరాడు. ఇలా చెత్త సినిమాలుచూసి ఎందరు పాడయిపోవడం లేదు? ఒకసినిమాలో రేప్‌సీన్ చూసిన ఓయువకుడు ఆరాత్రే ఒకరింట్లో ని మైనర్‌బాలికపై అత్యాచారం చేయబోయి పోలీసులకు పట్టుబడ్డాడు. ఇలాంటి సినిమాల స్ఫూర్తితో కర్నాటక రాష్ట్రంలో మరీ ఎక్కువగా నేరాలు జరుగుతున్నాయట. రెండోఆట సినిమా చూసివస్తున్న భార్యాభర్తలను ఆటోరిక్షాలో వస్తున్న ముగ్గురు యువకులు చూశారు. భర్తను చెట్టుకుకట్టేసి, అతనిఎదురుగానే భార్యను

—కొరవ 10 పేజీలో

విక్రమ్‌లో నాగార్జున

# డిస్కోశాంతికి అభిమాన సంఘమా?

ప్రసాద్ స్టూడియోలో "శత్రువు" సినిమా షూటింగ్. డిస్కో శాంతి డాన్స్. కొందరు యువకులు ఆమె దగ్గరికి వచ్చి, "మా కర్నూల్‌లో మీపేర అభిమాన సంఘం పెట్టాలనుకుంటున్నాం," అన్నారు. డిస్కోశాంతి నవ్వింది. "నేను యాక్ట్‌చేసిన డబ్బింగ్ చిత్రాలు తెలుగులో ఒకటోరెండో రిలీజై వుంటాయి. స్ట్రెయిట్ చిత్రం ఇంతవరకు ఒకటైనా రిలీజవలేదు. నాకు అభిమాన సంఘమేమిటి?" అంది. "మీరలా అంటే మేమెంతో బాధపడతాం," అన్నారా కుర్రాళ్లు. "సరే.... పెట్టారనుకోండి. దీనివల్ల ఏంలాభం?" అని శాంతి అడిగింది. "మీరు నటించిన పిక్చర్ విడుదలయ్యే రోజున మీ ఫోటోకు పూలమాల వేసి ఊరేగిస్తాం. మీ పిక్చర్‌ని బాగా ఆడించాలని కరపత్రాలు అచ్చువేయించి, ఊరంతా పంచిపెడ్తాం," అన్నారు. "పిచ్చివాళ్ళలా ఉన్నారు. నేను వేసే వేషాలేమిటి? నేనేం సాధించానని మీరింతగా ప్రయాస పడడం? బుద్ధిగా చదువుకొని, మంచి ఉద్యోగాలు సంపాదించి, హాయిగా బతకండి,అని వాళ్ళకు శాంతి బుద్ధిచెప్పి పంపింది. ★

# 'శ్రావణసంధ్య'లో స్త్రీ స్వాతంత్ర్యాన్ని పెడదారి పట్టించారు!

చిత్రసమీక్ష ★ గిద్దలూరు గోపాలరావు

శ్రావణి, సంధ్య అనే యిద్దరమ్మాయిల మనో ప్రవృత్తులను ప్రధానం చేసుకొని "శ్రావణసంధ్య" చిత్ర నిర్మాణం జరిగింది. ఈ యిద్దరమ్మాయిల మనోభావాలు వేరువేరుగా వుంటాయి.

మగవాడికిలా, ఆడదానికిగూడా సమాజంలో, సంసారంలో సమానత వుండాలంటుంది శ్రావణి. కానీ ఆ ఆవేశంలో భర్తను నిర్లక్ష్యంచేసి అగచాట్ల పాలవుతుంది.

ఇక సంధ్య, భర్తకు నిజమైన భార్యగా వుండాలంటుంది. కాని పరిస్థితుల ప్రభావంతో భర్త చేత విడాకులు పొందుతుంది.

శ్రావణి (విజయశాంతి) పేరుమోసిన వకీలు శ్రీనివాసరావు (రావుగోపాలరావు) కూతురు; ఈమెగూడా వకీలే. వకీలు చదివి వారి యింట్లోనే వున్న మేనత్త కొడుకు ప్రభాకర్‌ను (శోభనబాబు) వివాహమాడుతుంది. ఈమె అసిస్టెంట్ పబ్లిక్ ప్రాసిక్యూటరవుతుంది. భర్తను చులకనగా చూస్తుంది. ప్రభాకర్ వేరే యింటికి మారుతాడు.

సంధ్య (సుహాసిని) జీవితం ఏడేళ్ళ బాల్యంలోనే బాధాకరమవుతుంది. అమృతరావు (గొల్లపూడి) అనే మేకవన్నె పులి, విధవరాలైన తన తల్లిని మానభంగంచేసి అగ్నికి ఆహుతిస్తాడు. అతన్ని హత్య చేసేందుకు ఆ చిన్న వయసులోనే నిర్ణయం తీసుకుంటుంది. పెద్దదై ఒక పోలీసు అధికారి, ప్రభును పెండ్లాడుతుంది. తన భర్త పిస్తలుతో అమృతరావును [illegible]తుంది. భర్త, సంధ్యకు విడాకుల[illegible].

సంధ్య తరఫున ప్రభాకర్ వాదించి ఆమెను [illegible] తప్పిస్తాడు. సంధ్య, ప్రభాకర్ [illegible] శ్రావణి అపార్థం చేసుకుంటుంది. సంధ్య, శ్రావణి కన్ను తెరిపించి ప్రభాకర్‌తో కలుపుతుంది.

తనను భార్యగా స్వీకరించమని ఎంత ప్రాధేయపడినా భర్త అంగీకరించనందున అతనికి వేరే అమ్మాయితో వివాహం జరిపిస్తుంది సంధ్య.

కథ కాస్త నిడివిగా వుండి అక్కడక్కడా అర్థంలేని మెలికలు తిరిగి విసుగెత్తిస్తుంది. ఇంకా ఎంతసేపు చూడాలి యీ సినిమా అనిపిస్తుంది.

ముఖ్యమైన శ్రావణి, సంధ్య పాత్రల పోషణ చాలా లోపాలతో నిండివుంది. శ్రావణి కాలేజి డిబేట్‌లో స్త్రీ స్వాతంత్ర్యాన్నిగూర్చి, పురుషాధిక్యతనుగూర్చి వుపన్యాసమిస్తుంది. బహుమతిగూడా పొందుతుంది. అంతవరకు బాగానేవుంది. కాని ఆమెకు వివాహమైన తర్వాత ఆమె తీరుచూస్తే స్త్రీ స్వాతంత్ర్యమంటే ఆమె దృష్టిలో భర్తను నిర్లక్ష్యంచేసి, దాంపత్య జీవితం గడపకుండా తన కార్యకలాపాల్లో మునగటం అనుకున్నట్టుంది. ఆమె భర్త ఆమెకు గౌరవస్థానాన్నిస్తాడు, అయినా ఆమె భర్తను గడ్డిపరకలా చూస్తుంది. ఈ పాత్రలో స్త్రీ స్వాతంత్ర్యం పెడదారి పట్టింది.

సంధ్య విషయానికొస్తే ఆమె ఏడేళ్ల వయసులోనే, తన తల్లిని మానభంగం చేసిన అమృతరావును చంపుతానని తన చేతి రక్తంతో యింటిగోడమీద వ్రాస్తుంది. అంత చిన్నవయసులో అందులోనూ ఆడపిల్లలో అంతపగ, ప్రతీకారం చోటుచేసుకోవడం అతిశయోక్తిగావుంది. ప్రేమించి పెళ్ళాడిన సంధ్య, తొలిరాత్రి తన భర్త తనను కౌగలించుకోగా, అమృతరావు తనతల్లిని మానభంగం చేసిన దృశ్యం ఆలోచించుకొని భర్తను దగ్గరకు చేరనివ్వకపోవటం పెద్ద పొరపాటనిపిస్తుంది. భర్త ప్రేమను, దుర్మార్గుని మానభంగ చర్యకు పోల్చడం సమంజసంగాలేదు.

చిత్రానికి మూలాధారమైన యీరెండు పాత్రలను దర్శకుడు నడిపించిన వైనం సక్రమంగా లేదు. మిగతా పాత్రలు యీ పాత్రలచుట్టూ తిరిగే దిష్టిబొమ్మలుకాబట్టి వాటిని పట్టించుకోనక్కరలేదు.

విజయశాంతి, సుహాసిని చక్కగా నటించారు. శోభనబాబుకు, గొల్లపూడికి రావుగోపాలరావుకు వారి నటనకు తగ్గ పాత్రలు యిందులోలేవు. మంచి హాస్యనటులు వేలు, వీరభద్రరావులను దర్శకుడు సరిగ్గా వుపయోగించుకోలేకపోయాడు.

గణేష్‌పాత్రో మాటలు కొన్ని బాగున్నాయి. వేటూరి పాటలు ప్రేక్షకుల మనస్సులో చోటు చేసుకోలేవు. పాటలకు తాయారు సంగీతం చెవులను డిమ్మెక్కించింది. అది శబ్దమంటే శబ్దంకాదు.

చిత్రంలో చాలాభాగం కోర్టుసీన్లలో కోతిగంతులులాంటి సెక్సు డాన్సులతో నిండిపోయింది. సెక్స్ డాన్సులంటే చొంగకార్చుకుపోయేవారికి యీ చిత్రం కొంత వరకు నచ్చవచ్చు. ★

ఆలాపనలో వై. విజయ, మోహన

# తారల నిలువుదోపిడీ

ప్రొడ్యూసర్ దగ్గరికి సినిమా తారగారి డ్రయివర్ వచ్చి, "అమ్మగారు పెట్రోల్ డబ్బులడిగి రమ్మన్నారండి", అన్నాడు. నిర్మాత నివ్వెరపోయాడు. వాహినీ స్టూడియోనుంచే కదా మీ అమ్మగారు ఈ ఎ.వి.ఎం. స్టూడియోకి వచ్చింది? అక్కడ్నుంచి ఇక్కడికి అరఫర్లాంగ్ దూరమైనా లేదే! మరి పెట్రోల్ డబ్బులేమిటి?" అని [illegible] ...గారి బంగళాకూడా ఇక్కడికి దగ్గరే. ఉదయం బంగళానుంచి వాహినీ స్టూడియోకి వచ్చినప్పుడు ఆ ప్రొడ్యూసరు పెట్రోల్ డబ్బులు ఇచ్చినారుకదండీ! ఇంకో అరగంటలో [illegible] స్టూడియోలో మరో పిక్చర్ షూటింగుకు వెళ్తాంకదా? ఆ ప్రొడ్యూసర్ కూడా పెట్రోల్ డబ్బులు, వారు వేరేకూడా ఇచ్చుకోవలసిందే!" అన్నాడు డ్రైవర్. "ఏమిటీ! రోజుకు ఎన్నిపిక్చర్ల షూటింగులు వుంటే, అన్ని వేటాలు నీకు ముట్టుతుంటాయన్నమాట! నాకన్నా నువ్వే నయం. నేను ఫిలిమ్ ప్రొడ్యూసర్ అవకుంటా ఏతార దగ్గరో కారు-డ్రయివర్ [illegible] వాగుండేది." అని వాపోయాడా నిర్మాత. నిజమే, ఒకతార ఒక కాల్‌షీట్‌కు హాజరయిందంటే- ఆమె మేకప్‌మాన్‌కు, హేర్‌స్టయిలిస్టుకు, కాస్ట్యూమర్‌కు, చెలికత్తెకు, కారు డ్రయివర్‌కు అందరికీ డబ్బులు చెల్లించుకోవలసిందే. [illegible] నిర్మాతల దుస్థితి [illegible]. ★



మా ఉన్నతికి కారకుడు, దైవసమానుడు, మా తండ్రి

# గుండ్రా వెంకటకృష్ణారెడ్డిగారు

నెల్లూరు.

**8-1-86** తేది బుధవారం స్వర్గస్తులైనారు.

## ఉత్తరక్రియలు

**28-1-86** తేది మంగళవారం శిలాప్రతిష్ఠ

**29-1-86** తేది బుధవారం శిలోద్వాసన

నెల్లూరు వెంకట్రామపురంలోని మా స్వగృహమున జరుగును.

గుండ్రా జనార్దనరెడ్డి

[illegible] 17/170 [illegible] నెల్లూరు-524001